కుండినయెడల, తమ్ముఁ జూచి లోకులు నాచరింపకుందురు. దానిచే లోకనాశము గలిగి తన్మూలపాపమున తమ జ్ఞానయోగమునకును చ్యుతి గలుగును గాన) లోకరక్షణార్థము స్వర్గాదిఫలసంగము వదలి కర్తృత్వమును గుణములం దారోపించికాని, (గుణములకును గుణాశ్రయ మైన ప్రకృతికిని తత్సంసృష్టనియుక్త జైవులకును నియంత యైన) సర్వేశ్వరునియందు నుంచికాని, కర్మము చేయనలసిన దని తృతీయాధ్యాయమునఁ జెప్పఁబడినది.

శ్లో. ప్రసఙ్గా త్స్వస్వభావోక్తిః కర్మణోఽకర్మతాస్య చ
భేదా జ్ఞానస్య మాహాత్మ్యం చతుర్థాధ్యాయ ఉచ్యతే॥

తా. ప్రసంగవశమున, అవతీర్ణుఁడై యున్న భగవంతుఁడు తన యసాధారణభావమును జెప్పుటయు, కర్మము జ్ఞానాకారమగుటయు, కర్మముయొక్క భేదములును, జ్ఞానముయొక్క మాహాత్మ్యమును చతుర్థాధ్యాయమునఁ జెప్పఁబడుచున్నవి.

శ్లో. కర్మయోగస్య సౌకర్యం శైఘ్ర్యం కాశ్చన తద్విధాః
బ్రహ్మజ్ఞానప్రకారశ్చ పఞ్చమాధ్యాయ ఉచ్యతే॥ 9

తా. కర్మయోగము (జ్ఞానయోగమునకంటె) సుకరమై ఆత్మప్రాప్తిని గలిగించుటయందు శీఘ్రమైయుండుటయు, దానివిధములు కొన్నియు, శుద్ధాత్మవిషయమై సమదర్శనరూపజ్ఞాన (పరిపాక)ము కర్మయోగికి ఏప్రకారమున నెలకొనియుండినఁ గలుగునో యాప్రకారమును, పంచమాధ్యాయమునందుఁ జెప్పఁబడుచున్నవి.

శ్లో. యోగాభ్యాసవిధి *ర్యోగీ చతుర్ధా యోగసాధనమ్
యోగసిద్ధి స్స్వయోగస్య పారమ్యం షష్ఠ ఉచ్యతే॥ 10

* యోగీ చతుర్ధా అనఁగా యోగివిపాకదశ నాలుగువిధము లనుట; సమదర్శనముయొక్క పరిపాకదశలం నాలుగని భావము. ఆత్మలను జ్ఞానత్వానందత్వాదులను

తా. (ఆత్మావలోకన మనెడి) యోగము నభ్యసించువిధియు, యోగి నాలుగువిధము లగుటయు, అభ్యాసవైరాగ్యాదు లనెడి యోగ సాధనములును, యోగము (నడుమవిచ్ఛిన్నమైనను, అది ప్రత్యవాయము లేకుండుట, పుణ్యలోకప్రాప్తి, మిగతయోగమును గొనసాగించుటకుఁ దగిన విశిష్టకులోత్పత్తి, అభిక్రమనాశములేమి మొదలైన రూపమున) సిద్ధించుటయు, తన (అనఁగా భగవంతుని) యోగమైనభక్తియోగము తన్నుఁబట్టి అత్యుత్కృష్ట మగుటయు షష్ఠాధ్యాయమునందుఁ జెప్పఁ బడుచున్నవి.

శ్లో॥ స్వయాథాత్మ్యం ప్రకృత్యాస్య తిరోధి శ్శరణాగతిః
భక్తిభేదః ప్రబుద్ధస్య శ్రైష్ఠ్యం సప్తమ ఉచ్యతే॥ 11

తా. ఉపాస్యభూతుఁడైనపరమపురుషునియొక్క సర్వశేషిత్వాది రూపమైనస్వరూపయాథాత్మ్యమును, దేహేంద్రియాదిరూపమైనప్రకృతిచే నది మఱుఁగుపడియుండుటయు, తన్నివృత్తికొఱకు భగవత్ప్రపత్తి సేయుటయు, ఐశ్వర్యార్థులు మొదలైనయుపాసకులభేదమును, జ్ఞాని (అత్యంతపరమపురుషప్రియుఁ డగుటచే) శ్రేష్ఠుఁ డగుటయు, సప్తమాధ్యాయమునందుఁ జెప్పఁబడుచున్నవి.

శ్లో॥ ఐశ్వర్యాక్షరయాథాత్మ్య భగవచ్ఛరణార్థినామ్
వేద్యోపాదేయభావానా మష్టమే భేద ఉచ్యతే॥ 12

తా. (ఇంద్రప్రజాపతి పశుపతిభోగములకంటె నతిశయించిన భోగరూపమైన) యైశ్వర్యమును వివిక్తాత్మస్వరూపమును భగవచ్ఛరణమును గోరువారికి ప్రత్యేకముగా వేద్యములైన శుద్ధాత్మస్వరూపాదులయొక్కయు, ఉపాదేయములైన తత్తదిష్టఫలానురూపపరమపురుష చింతనాంతిమప్రత్యయగతిచింతనాదులయొక్కయు (తత్తదధికారాను

బట్టి కలుగు అన్యోన్యసామ్యదర్శనము, ఆత్మలకు శుద్ధావస్థయందు అపహతపాప్మత్వాదులచే ఈశ్వరునితోడఁ గలుగుసామ్యదర్శనము, ఇత్యాదులు.

రూపమైన) భేదము, అష్టమాధ్యాయమునఁ జెప్పఁబడుచున్నవి.

శ్లో. స్వమాహాత్మ్యం మనుష్యత్వే పరత్వంచ మహాత్మనామ్
విశేషో నవమే యోగో భక్తిరూపః ప్రకీర్తితః ॥ 13

తా. తన (భగవంతుని) మాహాత్మ్యమును, మనుష్యత్వము దాల్చియున్నప్పుడును తనపరత్వము చెడకుండుటయు, మహాత్ములకుఁ గలవిశేషమును, భక్తియోగమును నవమాధ్యాయమునందుఁ జెప్పఁబడినవి.

శ్లో. స్వకల్యాణగుణానన్త్య కృత్స్నస్వాధీనతామతిః
భక్త్యుత్పత్తివివృద్ధ్యర్థం విస్తీర్ణా దశమోదితా ॥ 14

తా. భగవంతునియందు భక్తి జనించి పయిపయి వృద్ధినొందుటకై, యతనినిరంకుశైశ్వర్యాది కల్యాణగుణములు అనంతములుగాను చేతనాచేతనాత్మకమైన సమస్తజగత్తుయొక్క స్వరూపస్థితిప్రవృత్తులు అతనికి లోనైనవిగాను ఉన్నవనెడుబుద్ధి సవిస్తారముగ దశమాధ్యాయమందుఁ జెప్పఁబడినది.

శ్లో. ఏకాదశే స్వయాథాత్మ్య సాక్షాత్కారావలోకనమ్
దత్తముక్తం విదిప్రాప్త్యోర్భక్త్యేకోపాయతా తథా ॥ 15

తా. తనస్వరూపసాక్షాత్కారముకొఱకు నర్జునునికి దివ్యచక్షువు నిచ్చుటయు, వేదనదర్శనప్రాప్తులకు భక్తియొక్కటే యుపాయ మగుటయు నేకాదశాధ్యాయమునఁ జెప్పఁబడినవి.

శ్లో. భక్తిశ్రైష్ఠ్య ముపాయోక్తి రశక్తస్యాత్మనిష్ఠతా
తత్ప్రకారాస్త్వతిప్రీతి ర్భక్తే ద్వాదశ ఉచ్యతే ॥ 16

తా. (ఆత్మప్రాప్తిసాధనమైన ఆత్మోపాసనముకంటె భగవదుపాసనమైన) భక్తి, (స్వసాధ్యమైన ఫలమును గలిగించుటయందు శీఘ్రమై సుఖముగాఁ జేకొనఁదగినదై యుండుటచే) శ్రేష్ఠమై యుండు

టయు, భక్త్యుపాయమును, దానికి శక్తిలేనివానికి ఆత్మనిష్ఠయు, వాని కుపాదేయములైన గుణప్రకారములును, భక్తునియందు భగవంతునికిఁ గల అతిప్రీతియు, ద్వాదశాధ్యాయమునఁ జెప్పఁబడుచున్నవి.

['తత్ప్రకారాః' అనఁగా ఆత్మనిష్ఠ కానశ్యకము లై కర్మయోగాదుల కపేక్షితములై 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాదులందుఁ జెప్పఁబడిన యుపాదేయగుణముల ప్రకారములు. అశక్తుని కాత్మనిష్ఠ యెట్లన, భగవంతునియందు చిత్తము సమాహితము చేయనేరనివానికి భగవద్గుణాభ్యాసమును, దానికి నశక్తుడైనవానికి ప్రీతిపూర్వకముగా భగవదసాధారణకర్మములను జేయుటయు, దానికి నశక్తుడైనవానికి ఆత్మనిష్ఠయు నని క్రమ మెఱుంగునది].

శ్లో. దేహస్వరూప మాత్మాప్తి హేతు రాత్మవిశోధనమ్
బన్ధహేతు ర్వివేకశ్చ త్రయోదశ ఉదీర్యతే॥ 17

తా. దేహస్వరూపమును, దేహావియుక్తాత్మప్రాప్త్యుపాయమును, వివిక్తాత్మస్వరూపశోధనమును, అట్టిశుద్ధాత్మక చిత్సంబంధము కలుగుటకు హేతువును, తద్వివేకానుసంధానప్రకారమును (అనఁగా అచిత్తు కంటె దానిని వేఱుగా ననుసంధించువిధమును) పదుమూఁడవయధ్యాయమునఁ జెప్పఁబడెడిని.

శ్లో. గుణబన్ధవిధా తేషాం కర్తృత్వం తన్నివర్తనమ్
గతిత్రయస్వమూలత్వం చతుర్దశ ఉదీర్యతే॥ 18

తా. శుద్ధాత్మకు గుణములు బంధహేతువులైన ప్రకారమును, వానికిఁ గర్తృత్వము కలుగువిధమును, అవి నివర్తించు ప్రకారమును, అక్షరము ఐశ్వర్యము భగవత్ప్రాప్తి అనెడి గతిత్రయమునకు తానే (భగవంతుఁడే) మూల మగుటయు, (అనఁగా అవి తనవలనే కలుగు ననుటయు) చతుర్దశాధ్యాయమునఁ జెప్పఁబడుచున్నవి.

[గుణము లెట్లు బంధహేతువు లనఁగా "కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు" అన్నట్లు పూర్వజన్మములందు సత్త్వాదిగుణము లందు (అనఁగా సత్త్వాదిగుణమయములైన సుఖాదులందు) గలసంగమే ఉత్తరోత్తరసుఖాదిసంగము కలిగించి తత్సుఖాదిసాధకములైన కార్యములందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. ఇట్లు గుణములు సంగముద్వారా బంధహేతువులగునని తెలియునది.]

శ్లో. అచిన్మిశ్రా ద్విశుద్ధాచ్చ చేతనా త్పురుషోత్తమః
వ్యాపనా ద్భరణా త్స్వామ్యా దన్యః పఞ్చదశోదితః॥ 19

తా. అచిత్తుతోఁ గూడియున్న బద్ధచేతనునికంటెను శుద్ధచేతనుని కంటెను, పురుషోత్తముఁడు, వ్యాపకుఁడును భర్తయు స్వామియు నగుటచే, విలక్షణుఁడని పంచదశాధ్యాయమునఁ జెప్పఁబడెడిని.

శ్లో. దేవాసురవిభాగోక్తి పూర్వికా శాస్త్రవశ్యతా
తత్త్వానుష్ఠానవిజ్ఞాన స్థేమ్నే షోడశ ఉచ్యతే॥ 20

తా. శాస్త్రవశ్యులైనవారు దేవత లనియు, శాస్త్రవశ్యులు కానివారు అసురులనియు నిర్ధరించి, యిట్టివిభాగమువలన శాస్త్రవశ్యత్వ మావశ్యకమని తెలుపుచు, ప్రాప్యమైన తత్త్వమునుగుఱించిన జ్ఞానమును, తత్ప్రాప్త్యుపాయమైన కర్మాద్యనుష్ఠాన విషయమైనజ్ఞానమును, వేదరూపమైన శాస్త్రమువలననే కలుగఁదగినవగుటచే అట్టిజ్ఞానము దృఢముగాఁ గలుగుటకై యిట్టిశాస్త్రమునకు వశ్యమైయుండవలయునని షోడశాధ్యాయమునఁ జెప్పఁబడుచున్నది.

శ్లో. అశాస్త్ర మాసురం కృత్స్నం శాస్త్రీయం గుణతఃపృథక్
లక్షణం శాస్త్రసిద్ధస్య త్రిధా సప్తదశోదితమ్॥ 21

తా. శాస్త్రవిహితములుకాని కర్మములన్నియు ఆసురములగుటచే నిష్ఫలములనియు, శాస్త్రవిహితకర్మములు సత్త్వాదిగుణములను

బట్టి మూఁడువిధములనియు, శాస్త్రసిద్ధకర్మములు 'ఓంతత్సత్' అని త్రివిధలక్షణము గలవనియు, సప్తదశాధ్యాయమునఁ జెప్పఁబడినది

శ్లో. ఈశ్వరే కర్తృతాబుద్ధి స్సత్త్వోపాదేయ తాన్తిమే
స్వకర్మపరిణామశ్చ శాస్త్రసారార్థ ఉచ్యతే॥ 22

తా. సర్వేశ్వరుఁడు సర్వకర్మములకు కర్తయని యనుసంధించుటయు, (సత్త్వాదులకార్యములను వర్ణించి తన్మూలమున) సత్త్వమే ఉపాదేయమనుటయు, (భగవదారాధనరూపములుగాఁ జేయఁబడు) స్వవర్ణోచితకర్మములు పరమపురుష (ప్రాప్తిని నిర్వర్తించునవిగా) పరిణమించుటయు, శాస్త్రసారార్థమైన భక్తియోగమును, జెప్పఁబడుచున్నవి.

అవ. ఇఁక పదిశ్లోకములచేత కర్మజ్ఞానభక్తియోగాదుల స్వరూపాదులను వివేచించుచున్నారు.

శ్లో కర్మయోగ స్తపస్తీర్థ దానయజ్ఞాది సేవనమ్।

తా. తపస్సు, తీర్థము, దానము యజ్ఞము మొదలైనవానిని సేవించుటయె కర్మయోగము, [సేవించుట యనఁగా ఫలముగలుగువఱకు ఆదరముతో ఎడతెగక పరిగ్రహించుట.]

శ్లో. జ్ఞానయోగో జితస్వాన్తైః పరిశుద్ధాత్మని స్థితిః॥ 23

తా మనస్సును జయించినవారికి పరిశుద్ధాత్మయందుఁగల నిరంతర చింతనరూప మైనస్థితియే (అనఁగా మనోనిగ్రహ పూర్వకముగా శుద్ధాత్మచింతనవిశేషము) జ్ఞానయోగము. [ఈనిర్వచనమువలన నిది స్వకీయఫల మైనయోగమునకును తదుపాయజ్ఞానమునకును వేఱైన దని తెలియునది.]

అవ. అంతరంగములతోఁ గూడ భక్తియోగముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.

శ్లో. భక్తియోగః పరై కాంత ప్రీత్యా ధ్యానాదిషు స్థితిః

తా. ఈశ్వరునియందలి యేకాంతప్రీతిచే ధ్యానము మొదలైన

వానియందు నెలకొనుటయె భక్తియోగము. [ఇచట ఆదిశబ్దముచే భక్తి కంతరంగములైన అర్చనప్రణామాదులు గ్రాహ్యములు. వర్ణాశ్రమ ధర్మానుష్ఠానమును గ్రాహ్యము]. భగవంతునియందలియత్యంతప్రీతిచే, తద్విషయములైన ధ్యానార్చనాదుల నత్యంతప్రియములుగాఁ జేయుట భక్తియోగమని భావము.

అవ. కర్మయోగమునందు అంతర్గతాత్మజ్ఞానమును, ఆరాధ్యుఁడైన యీశ్వరుని గుఱించిన ప్రీతియు (అనఁగా భక్తియు) అనువర్తించు చున్నవి. జ్ఞానయోగమునందును అంతఃకరణశుద్ధికొఱకు నియతమైన కర్మమును తత్కార్మారాధ్యుఁడైన యీశ్వరునిగుఱించినభక్తియు ననువర్తించుచున్నవి. భక్తియోగమునందును కర్మజ్ఞానము లనువర్తించు చున్నవి. ఇట్లు మూఁడు నొక్కరూపున నుండఁగా వానిని వేఱు వేఱ విభాగముసేయుట తగునా యన్నఁ జెప్పుచున్నారు.

శ్లో॥ త్రయాణామపి యోగానాం త్రిభిరన్యోన్యసఙ్గమః॥ 24

తా. కర్మజ్ఞానభక్తియోగము లనెడిమూఁడు యోగములకును తమలో నొకటితో నొకటికిని సంగమము కలదు. ఒక్కొక్కదానియందును తక్కినరెండును గొంత కలసియుండుననుట. విశేషించిన భాగమునుబట్టి ఆయానామము కలుగుచున్న దని భావము.

[ప్రధానమైన పాలునందు గుణముగా చక్కెర చేరినపుడు ఆపాలు పాలేయనఁదగునుగాని వేఱొకటికాదు. అట్లేప్రధానమైన యొకయోగమునందు గుణముగా మఱొకటిప్రవేశించినను, అది ఆయోగమె యగును గాని కలిసినయోగము గాదు. ఈ క్షీరశర్కరాన్యాయమున, కర్మజ్ఞానాది యోగములును పరస్పరము కూడినవై యున్నను వానివాని ప్రధానతను బట్టి వేఱువేఱ విభాగము సేయఁదగునని యెఱుంగునది.]

అవ. ఈపరస్పరసంగమమువలన ఈశ్వరునియందలి యేకాంతప్రీతి యీమూఁడుయోగములందును సమాన మని తెలియుచున్నదిగదా.

ప్రీతి ఏకాంత మైన దనఁగా అనన్యదేవతాకమైన దని యర్థము. ఇతర దేవతలను గుఱించినట్టిది కానిది యనుట. నిత్యనైమిత్తికరూపము లైన వర్ణాశ్రమధర్మములు అగ్నీంద్రాదులైన అన్యదేవతలను గుఱించినవి గాన అవి అనన్యదేవతాక మైనప్రీతికి భంజకము లగును. కాఁబట్టి వానిని మూఁడుయోగములందును పరిత్యజింపవలదా యనఁగాఁ జెప్పు చున్నారు.

శ్లో॥ నిత్యనైమిత్తికానాం చ పరారాధనరూపిణామ్।

తా॥ ఈశ్వరారాధనరూపము లైన నిత్యనైమిత్తికములును మూఁడు యోగములతో సంగమము కలిగియున్నవి.

[నిత్యనైమిత్తికము లవశ్యకర్తవ్యము లగుటచేతను, వానిగారారాధ్యులైన అగ్నీంద్రాదిశబ్దములు తద్దేవతాశరీరకుఁడైన పరమాత్మయందే పర్యవసించుటచేతను, అన్యదేవతారాధనము లైన యాగకర్మములు ఆ దేవతలద్వారా తదంతర్యామి యైన పరమపురుషుని యారాధనము చే యగుటచేతను, వానిననుష్ఠించుటవలన పరమపురుషునియందలియేకాంత ప్రీతికిభంగముకలుగదు. కావున నవి మూఁడుయోగములందును సంగ మము కలిగియుండఁదగును.

శ్లో॥ ఆత్మదృష్టేస్త్రయోఽప్యేతే యోగద్వారేణ సాధకాః॥ 25

తా॥ ఈమూఁడుయోగములును యోగద్వారమున ఆత్మావ లోకనమునకు సాధకము లగును.

[యోగ మనఁగా ఆత్మావలోకమునకు హేతువై చిత్తసమాధి రూపమైన వ్యాపారము. దీనిచేఁ గలుగు ఆత్మసాక్షాత్కారమే యాత్మ దృష్టి. అనఁగా ఆత్మావలోకనము, మూఁడుయోగములును ఈసమాధి రూప మైనయోగముఁ గలిగించి తత్కాలమున ఆత్మావలోకనమును సిద్ధింపఁజేయుచున్న దనుట, కర్మయోగము జ్ఞానయోగవ్యవధాన ముగ్గాను లేక తానే యోగమును గలిగింపఁజాలు ననుట పూర్వమే వివరింపఁబడి యున్నది.]

అవ. మూఁడుయోగములచే నాత్మావలోకమును, దానిచే పరమభక్తియు, పరమభక్తిచేతనే పరమప్రాప్తియుఁ గలుగుట చెప్పుచున్నారు.

శ్లో. నిరస్తనిఖిలాజ్ఞానో దృష్ట్వాత్మానం పరానుగమ్
ప్రతిలభ్య పరాం భక్తిం తయైవాప్నోతి తత్పరమ్॥ 26

తా. ఉపాయవిరోధులైన సమస్తాజ్ఞానములు నివర్తించినవాఁడు ఈశ్వరుని కనువర్తమైనతనయాత్మను గనుఁగొని (అనఁగా భగవచ్ఛేషత్వైకరసమైన తనయాత్మస్వరూపముయొక్క దర్శనమునొంది), దానిచే పరమాత్మునివలననుండి పరభక్తినిలభించి, పరమభక్తిరూపముగా పరిపాకమునొందిన యాభక్తిచేతనే పరమపురుషపదమును బొందుచున్నాఁడు. [ఇచట పదశబ్దముచే భగవచ్చరణమునుగాని ముక్తులకు ప్రాప్యమైన భగవదప్రాకృతిస్థానమునుగాని భగవత్స్వరూపమునుగాని గ్రహించుకొనఁదగును.]

అవ. భక్తి మోక్షసాధనమగుట చెప్పఁబడినది. అదియె మధ్యమషట్కమునఁ జెప్పఁబడినట్లు అచిద్ద్రవ్యపరిణామ విశేషము ననుభవించుటయనెడి ఐశ్వర్యమునకును సాధన మగునని చెప్పుచున్నారు.

శ్లో. భక్తియోగస్తదర్థీ చే త్సమగ్రైశ్వర్యసాధనమ్

తా. ఐశ్వర్యమును గోరువాఁడగునేని, వానికి భక్తియోగము సమగ్రమైన (అనఁగా బ్రహ్మాదులొసంగు నైశ్వర్యమునకంటె మించిన) యైశ్వర్యమునకు సాధకమగును.

అవ. అచిత్తత్త్వానుభవరూపమైన యైశ్వర్యమునకు భక్తిసాధనమగుట చెప్పఁబడినది. ఇఁక చేతనరూపాత్మతత్త్వానుభవరూపమైన కైవల్యమునకు భక్తియోగమును, పరమపురుషప్రీతిద్వారా కర్మజ్ఞానయోగములును, సాధనము లగుటను జెప్పుచున్నారు.

శ్లో. ఆత్మార్థీచే త్త్రయోఽప్యేతే తత్కైవల్యస్య సాధకాః॥ 27

తా. వివిక్తాత్మానుభవముగోరువాఁడేని వానికి నీమూఁడు యోగ

ములును వానికై వల్యమునకు సాధకము లగును.

అవ. ఏకాంతముయొక్క భావము ఐకాంత్యము. ఇదియే అనన్య దేవతాకత్వము—అనఁగా ఇతర దేవతలను గుఱించినది కాక భగవంతునే గుఱించియుండుట. ఇదియె భక్తియొక్క సారభూతమైన సాధారణ రూపము— అనఁగా 'చతుర్విధా భజన్తేమామ్' ఇత్యాదులందుఁ జెప్పఁబడిన నాలుగు భక్తిరూపములకును సాధారణమైననారాంశము. ఇట్టి యైకాంత్యము మూఁడుయోగములందును సమాన మనుచున్నారు.

శ్లో. ఐకాన్త్యం భగవత్యేషాం సమాన మధికారిణామ్

తా. భగవంతునియందు ఐకాంత్యము, ఈముగ్గురధికారులకును (అనఁగా కర్మజ్ఞానభక్తియోగముల మూఁటియందును) సమానము. భక్తియోగమందు ఐకాంత్యము సహజము. కర్మయోగజ్ఞానయోగములందును భగవత్ప్రపత్తి ముందు కావలసినదగుటచే తద్విషయకమైన ఐకాంత్యమును గావలయును గనుక నీమూఁడుయోగములందును ఫలసిద్ధి పర్యంతము ఐకాంత్యము ఆవశ్యకమైయుండుట సమానము. అయినను జ్ఞానికి ఇది ఫలానంతరమునఁగూడ (అనఁగా నిత్యముగా) ఉండునని విశేషము తెలియునది.

అవ. భగవత్ప్రాప్తిని గోరువానికగు ఆత్యంతికతత్ప్రాప్తిరూప ఫలముఁ జెప్పుచున్నారు.

శ్లో. యావత్ప్రాప్తి పరార్థీచే త్తదేవాన్త్య మశ్నుతే॥ 28

తా. భగవత్ప్రాప్తిపర్యంతము భగవంతునే కోరువాఁడేని (అనఁగా ఫలాంతరసంగములచే నడుమ విఘ్నములు గలిగి చెడినవాఁడుగాక భగవదనుభవమే కోరువాఁడేని) ఆత్యంతికమైన యాభగవత్పదమునే పొందుచున్నాఁడు.

అవ. జ్ఞానియొక్క అనన్య సాధారణవిశేషమును వాని యనుష్ఠానఫలప్రాప్తులవిధము మొదలైనవియు రాఁగలనాలుగు శ్లోకములం జెప్పుచున్నారు.

శ్లో. జ్ఞానీతు పరమైకాన్తీ తదాయత్తాత్మజీవనః
తత్సంయోగవియోగైక సుఖదుఃఖ స్తదేకధీః॥ 29

తా. జ్ఞానియో ఏకాంతు లైనవారిలోనెల్ల శ్రేష్ఠుఁడై, పరమాత్మకు లోనైనజీవనముగలవాఁడై (అనఁగా తనజీవనము పరమాత్మపరముగానే వుచ్చువాఁడై), వానితోడిసంశ్లేషమే సుఖముగాను వియోగమే దుఃఖముగాను గలవాఁడై, వానియందే చింత గలిగియుండును.

[అనన్యదేవతాకులే ఏకాంతులు. జ్ఞాని అనన్యదేవతాకుఁడేకాక అనన్యప్రయోజనుఁడునగుటచే పరమైకాంతి (అనఁగా నేకాంతులలో పరముఁడు) అనఁబడెను. ప్రాప్తి యింకను గలుగకమునుపే సంశ్లేష వియోగము లెట్లు కలుగు నన్నచో, నిచట భగవంతునిగూర్చి మనోవాక్కాయములచే శాస్త్రచోదితసపర్యలను జేయుచుండుటయే వానితోడిసంశ్లేషము. ఆ సపర్యలను విడుచుటయే వానితోడివియోగ మని తెలియునది.]

శ్లో. భగవద్ధ్యానయోగోక్తి వందనస్తుతికీర్తనైః
లబ్ధాత్మా తద్గతప్రాణమనో బుద్ధీన్ద్రియ క్రియః॥ 30

తా. మఱియు జ్ఞాని భగవంతుని అనుచింతనముసేయుట, తన్స్థలమున నవలోకించుట (లేక విశిష్టక్షేత్రములందు వర్తించు భగవంతుని గూర్చి పోవుట), భగవత్స్వరూపాదుల నుపదేశించుట, వందనస్తోత్ర కీర్తనముల చేయుట, వీనిచేత ఆత్మనులభించినవాఁడై ప్రాణమనోబుద్ధీంద్రియవ్యాపారములను భగవత్పరముగాఁ జేసినవాఁడగును.

[ఆత్మ పూర్వమేకలిగియుండియు ధ్యానాదులచె నది లభించిన దిగా చెప్పుట యెట్లు అన్నచో, నది ధ్యానాదులులేనిచో ఉండియు లేనట్టిదిగాను ధ్యానాదులు కలిగినపిదప నదియు కలదానితో సాటిగాను దలఁచువాఁ డనుట. భగవద్ధ్యానాదులు లేనిచో ఆత్మ నిలుపోవక కరణ కళేబరశిథిలుఁ డగునట్టివాఁడనుట. ధ్యానాదులు లేనిచో ప్రాణాది

వ్యాపారములు వానికి శిథిలము లగును గనుక నవి భగవంతునియందే సమర్పించియుండు నని తెలియునది.]

అవ. భగవద్గతము లైన బుద్ధీంద్రియాదివ్యాపారములుగల యట్టి యధికారికి వర్ణాశ్రమధర్మలోపము కలుగకపోవునా యనఁగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ నిజకర్మాదిభక్త్యన్తం కుర్యాత్ప్రీత్యైవకారితః

తా. ప్రీతిచేతనే ప్రేరితుఁడై స్వవర్ణోచితకర్మానుష్ఠానము మొదలుకొని భక్తివఱకును జేయును.

(కర్మాదులు భగవదాజ్ఞారూపములు. నిత్యదాస్యముసేయుముక్తునివలెనే జ్ఞానికిని శాస్త్రముచొప్పున అధికారమునకుఁదగినట్లు సమయమెఱిఁగి భగవదాజ్ఞల ననువర్తించుటయందు ప్రీతిగలిగియుండినసే భగవత్పరిచరణము ఘటించును. లేనియెడల, 'సన్ధ్యాహీనోఽశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు' అన్నట్లు, శాస్త్రీయకర్మాదులందు ప్రీతిలేనివానికి భగవదర్చనాదులందు అధికారము సిద్ధింపదు. అట్టియధికారము సిద్ధించుకొఱకు సిద్ధోపాయముగలవాఁడునైతము తనకు లభించినజ్ఞానముచేడకపై పయివృద్ధినొందుటకును, తనయనుష్ఠానముచే పరులను ప్రవర్తింపఁజేయుట యనెడిభగవదాజ్ఞను పరిపాలించుటకును, అవశ్యకర్తవ్యములైనకర్మములను అవి విధింపఁబడియుండుటనుబట్టిగాక భగవదాజ్ఞలనెడు ప్రీతినిబట్టి యవశ్య మాచరింపవలయును. కాఁబట్టి యీయధికారికి వర్ణాశ్రమధర్మలోపముకలుగ దని భావము.)

శ్లో. ఉపాయతాం పరిత్యజ్య న్యసేద్దేవేతు తా మభీః॥ 31

తా. కర్మాదులం దుపాయత్వమును బరిత్యజించి యాయుపాయమును ఈశ్వరునియందే యుంచి నిర్భయుఁడై యుండవలయును.

('సర్వధర్మాన్ పరిత్యజ్య' అన్నట్లు కర్మాదుల నుపాయములుగాఁ గైకొనక వానిని భగవదాజ్ఞలనెడిప్రీతిచే భగవత్కైంకర్యముగామాత్ర

మనుష్ఠించుచు 'మామేకం శరణం వ్రజ' అన్నట్టి భగవంతునే యుపాయముగా స్వీకరించి 'మాశుచః' అన్నట్లు నిర్భరుఁడై యుండవలయునని భావము. సర్వశరణ్యుఁడై వాత్సల్యాదిగుణసాగరుఁడైన సర్వేశ్వరుఁడే యుపాయమైనపిదప భయ మేమి యని తెలుపుటకై 'అభీః' అనఁబడెను.

శ్లో. ఐకాంతాత్యంత దాస్యైకరతి స్తత్పద మాప్నుయాత్

తా. అన్యదేవతావిషయము గానిదై అంతము లేనిదైయొప్పునట్టి భగవద్దాస్యమునందే యాసక్తిగలవాఁడు తత్పదమును బొందును. (ఏకాంతాత్యంతమనుటచే అంతరాయములచే నిష్ఠ చెడకుండుట గ్రహించునది.)

శ్లో. తత్ప్రధాన మిదం శాస్త్ర మితి గీతార్థసంగ్రహః॥ 32

తా. ఈశాస్త్రము అదియేప్రధానముగాఁగలది. ఇట్లు గీతార్థసంగ్రహము. "తత్ ప్రధానమ్" అనుచో "తత్" అనఁగా భక్తిప్రపత్తిరూప మైన ప్రాపకనిష్ఠగాని, ప్రాపించువాఁడైన పరమైకాంతిగాని, వానికిప్రాప్యమైనపదముగాని గ్రాహ్యము. (అనఁగా ఈశాస్త్రమపవర్గమును ప్రధానముగా గుఱించినదిగనుక అపవర్గసాధన మైనశాస్త్ర మని భావము.)

శ్రీమద్యామునమునయే నమః.



# చరమశ్లోకార్థము

## అష్టాదశాధ్యాయమునందలి ౬౬ వ శ్లోకమునకు

### * ప్రపత్తివిషయమైన రహస్యార్థము.

### అవతారిక

దేహాత్మాభిమానియై ఆత్మ పరమాత్మవివేకశూన్యుఁడైన యర్జుననిగూర్చి సకలపాపధ్వంసనిపుణములగు దివ్యకటాక్షములచేతను సుధలొలుకు మధురాలాపములచేతను ముముక్షుత్వవిరోధులైన సకల ప్రతిబంధకములను నశింపఁజేసి మోక్షరుచి కలుగఁజేసి 'తేతంభుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' ఇత్యాదులచేత ఐశ్వర్యము లల్పాస్థిరత్వాదిదోషదూషితములై యుండుననియు, 'జరా మరణమోక్షాయ' ఇత్యాదులచేత కైవల్యము క్లేశసాధ్యత్వాదిదోష దుష్టమైయుండుననియు, 'మాముపేత్యతు కౌన్తేయ' ఇత్యాదులచే భగవత్ప్రాప్తిలక్షణమైన మోక్షమే నిరతిశయపురుషార్థమనియు నాన తిచ్చి 'తస్మాదసక్తస్సతతమ్' ఇత్యాదులచే కర్మజ్ఞానభక్తులను స్వప్రాప్తి సాధనములుగా నుపదేశించెను. అర్జునుఁడు, అవియన్నియు కాయ

---

* 'అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకమ్। తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తిశ్శరణాగతిః॥' అనునట్లు తనయభీష్టము మఱి యెవ్వరిచేతను సాధ్యము కానిది గాన వానినే (ఈశ్వరునే) మిక్కిలి విశ్వాసముతో నుపాయముగా వేఁడి శరణుఁజొచ్చుటయే ప్రపత్తియనఁబడును. ఇది మొదట నొకమాఱు చేయఁదగినదికాని మరలమరలఁ జేయుట (అనఁగా పునఃప్రపత్తి) తగదు. ఇదియే న్యాసమనియు శరణాగతి యనియుఁ జెప్పఁబడును. మఱియు కర్మజ్ఞానాద్యుపాయములు చేతనుని ప్రయత్నముచేత సాధింపవలయునట్టివి గాన అవి సాధ్యోపాయము లగును. భగవంతుఁడు చేతనుని ప్రయత్నముచే క్రొత్తగా సాధింపఁబడువాఁడు గాక పూర్వమే యనాదిగా సిద్ధుఁడైయుండుటచే సిద్ధోపాయ మగును. అట్టివాని నుపాయముగా వరించు ప్రపత్తి సిద్ధోపాయవరణమనియుఁ బేర్కొనఁబడును.

క్లేశరూపములగుటయు, వానికి వలయు నింద్రియజయ మతిదుష్కర మగుటయు, వానిని సాధించుటకు చిరకాలముపట్టుటయుఁ జూచి యవి యనుష్ఠింప నశక్యములనియు, భగవదతిపరతంత్రమైయుండు *స్వరూపమునకు విరుద్ధములనియుఁ దలఁచి శోకావిష్టుఁడుకాఁగా భగవంతుఁడు 'నేను ముం దుపదేశించిన సాధనవిశేషములను బరిత్యజించి నన్నే నిరపేక్షసాధనముగ నధ్యవసింపుము' అని సుకరమై స్వరూపానురూపమైయుండు నొకయుపాయము నుపదేశించెను. దాని కవ్వలియుపాయము మఱొకటి లేక యదియె చరమమైయుండుటచే దాని బ్రతిపాదించు నీశ్లోకము చరమశ్లోక మనఁబడుచున్నది. ఇందు పూర్వార్ధమున *అధికారియైనవాఁడు ఉపాయభూతుఁడైన యీశ్వరునికిఁ జేయుకృత్యమును, ఉత్తరార్థమున నుపాయమైన యీశ్వరుఁ డధికారికిఁ జేయుకృత్యమును ప్రతిపాదింపఁబడుచున్నవి. అధికారికృత్యము ఉపాయపరిగ్రహము ఉపాయపరిగ్రహమున కంగము ఉపాయాంతర పరిత్యాగము. కనుక దానిని 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనిచెప్పి పిదప అంగియైన యుపాయపరిగ్రహమును 'మా మేకం శరణం వ్రజ' అని విధించుచున్నాఁడు.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

'సర్వధర్మాన్' సకలధర్మములును అనుట. ధర్మ మనఁగా ఒక ఫలమునకు సాధనమైనది. ఇది మోక్షోపాయప్రకరణము కనుక దృష్ట

* శరీరికి అతిపరతంత్రమై శరీరముండునుగనుక వాఁడెట్లు జరుపునో యట్లే యది ప్రవర్తించునుగాని తనంతఁ జేమియుఁ జేయనేరదు. పరమాత్మకు చేతనుఁడును శరీరభూతుఁడై పరతంత్రుఁడై యుండుటవలన నాపరమాత్మ జరుపునట్లె వాఁడు ప్రవర్తింపఁదగునుగాని తనంతఁ దాను ప్రయత్నమును జేయఁదగదు. ఇట్టి పారతంత్ర్యము వాని స్వరూపము. కర్మాదులు వానికి స్వప్రయత్నరూపము లగుటచే నట్టి స్వరూపమున కవి విరుద్ధము లని భావము.

* పురుషార్థము, ఉపాయము, అధికారి యనిమూఁడు తెలియఁదగినవి. పురు

ములైన పుత్రపశ్వన్నాదిఫలములకు సాధనములైన వానిని గ్రహింపక భగవత్ప్రాప్తిరూపమోక్షఫలమునకు సాధనములగువానిని గ్రహించునది. ఇది శ్రుతిస్మృతివిహితములై యనేకములై యుండుటచే 'ధర్మాన్' అని బహువచనప్రయోగము. దీనికి సర్వశబ్దము విశేషణము. 'సన్ధ్యాహీనో౽శుచిర్నిత్య మనర్హస్సర్వకర్మసు' అని సంధ్యావందనాదినిత్యకర్మములు లేనివాఁడు కర్మములన్నిటికి ననర్హుఁడనుటచే కర్మాదులనుష్ఠించునపుడు వానిననుష్ఠించుటకు వలయు యోగ్యత గలిగించుట కావశ్యకములై, కావునను వానికి విశేషములైయుండు నిత్యకర్మములను విశేషణభూతమైనయీసర్వశబ్దము తెలుపుచున్నది. కనుక 'సర్వధర్మాన్' అనఁగా *శ్రుతిస్మృతిచోదితములై నిత్యనైమిత్తికాదిరూపములై భగవత్ప్రాప్తిరూప మోక్షసాధనములైన యొప్పు కర్మయోగాద్యుపాయములు అని యర్థము.

'పరిత్యజ్య' విడిచి యనుట, ఈ విడుచుట కేవలమైనదికాదు. పూర్వోక్తములైన యుపాయముల ననుసంధించి ముత్తెపుఁజిప్పను వెండిగాఁదలఁచినట్లును, 'భగవత్ప్రాప్తి కుపాయమునపేక్షించిన మనము దానికుపాయములు కానివానిని ఉపాయములుగఁదలఁచి వానియందుఁ

---

షార్థమనఁగా ప్రాప్యము- అనఁగా ఫలము. దానికి సాధనమైనది యుపాయము. ఉపాయములను గైకొని తాను గోరినదిచెందుటకు యోగ్యుడైనవాఁ డధికారి.

* ఈ యుపాయము సిద్ధత్వసుకరత్వాదులనుబట్టి తక్కినయుపాయములకంటె విలక్షణమైయుండుటవలన రక్తితోఁ గైకొనఁదగియుండఁగా 'వ్రజ' అని విధింపనేల యన్నచో, పాలుమిక్కిలి రుచ్యమగుటచే విధియక్కఱలేకరక్తితోనే గైకొనఁదగియుండియుఁ పిత్తరోగికి దానిని 'గైకొనుము' అని మందుగా విధించుటయెల్ల దానిని తప్పక త్వరతోఁ గైకొనుటకే యగును. అట్లే యీ యుపాయముసైతము రాగప్రాప్తమయ్యును విధింపఁబడుట త్వరపరిగ్రహణార్థ మని తెలియునది.

* శ్రుతిస్మృతివిహితమోక్షసాధనము లెవ్వియన 'కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః' 'తస్మాదసక్తస్సతతం కార్యం కర్మసమాచర' అని స్వతంత్రసాధనముగాఁ

ప్రవర్తించితిమే' యను బుద్ధివిశేషముతో విడుచుట. 'పరి' అనెడి యుపసర్గము శేషార్థకము. వానిని విడువఁగా మిగిలియున్న వానియందలి రుచివాసనలఁ దెలుపును. బ్రహ్మహత్యాదిపాతకములనుఁ బోలి ఇట్టివానిని మనము చేయఁదగునాయని లజ్జించి వానియందలి రుచివాసనలతోఁగూడ వానిని విడుచునట్లు 'అథ పాతకభీత స్త్వమ్' అని ధర్మదేవత పాకతములుగాఁ జెప్పిన యుపాయాంతరములను జూచి భగవంతునే యుపాయముగాఁ గలిగియుండునట్టి మన స్వరూపమునకు అత్యంతవిరుద్ధములైన యీ యుపాయములను మనము చేయఁదగునాయని లజ్జించి, బుద్ధిపూర్వకముగా వానియందుఁ బ్రవర్తింపఁజేయు రుచితోడను అబుద్ధిపూర్వకముగా వర్తింపఁజేయు వాసనతోడను మగల వానియం దన్వయము కలుగకుండునట్లు విడుచుటయని భావము. ఇందు 'త్యజ్య' యనునది క్త్వార్థకము. 'స్నాత్వా భుఞ్జీత' అని క్త్వార్థకముగల విధి, స్నానము చేసియే భుజింపవలయునని నియమమును దెలుపునట్లు ఇదియు త్యాజ్యములైన యుపాయాంతరములను విడిచియే సిద్ధోపాయమును బరిగ్రహింపవలయు నని తెలిపెడిని. ఉపాయాంతరములను విడువక యే సిద్ధోపాయమును పరిగ్రహించిన నేమి యన్నచో 'రోమవజ్రపాతాళని సన్నిపాతా

---

చెప్పఁబడినకర్మయోగము, 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' 'నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే' 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' అని కర్మసాధ్యముగాఁ జెప్పఁబడినజ్ఞానయోగము. 'భక్త్యాత్వనన్యయా శక్యః' 'మన్మనా భవ మద్భక్తః' అని కర్మజ్ఞానసహకృతముగాఁ జెప్పఁబడిన భక్తియోగమును, 'జన్మకర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః। త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున' అని విరోధినివృత్తిపూర్వకమైన భగవత్ప్రాప్తికి సాధనముగాఁ జెప్పఁబడిన యవతార రహస్యజ్ఞానమును, 'ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత' అని యభిమతఫలలాభముచే కృతకృత్యునిగాఁ జేయు పురుషోత్తమత్వజ్ఞానమును, మఱియు పుణ్యక్షేత్రవాస దివ్యనామసంకీర్తన దీపారోపణ మాల్యసమర్పణము లాదిగా నుపాయబుద్ధితోఁ జేయఁబడునవి యన్నియు.

స్నచుక్షుభే నాపిచచాల రాజా।స రామభాణాభిహతో భృశార్తశ్చ
చాల చాపంచ ముమోచ వీరః'॥

రామాయణ, యుద్ధ ౫౯ స. ౧౪౧ శ్లో

అను శ్లోకమున రావణుండు రాముని క్రూరశరజాలములపాలై కలంగి పోవఁజూచియు చేత విల్లు దాల్చియున్నంతవఱకును రాముఁడు పోవనీయందున నావింటిని 'ముమోచ' విడిచెను. పిదపనే రాముఁడును 'గచ్ఛానుజానామి' అని వాఁడు పాఱిపోవ ననుమతించెను. ఇట్లావిల్లు దాల్చియున్నంతవఱకును రావణునకు తాను గోరినశత్రుజయమున కది యుపాయముకాకపోవుటమాత్రమేకాక వాఁడు పాఱిపోవుటకును ప్రతిబంధక మయ్యెను. ఇట్లె యుపాయాంతరములం దన్వయ మొకించుక యుండినను అవి పురుషార్థమున కుపాయములు కాకుండుటమాత్రమేకాక దానికి ప్రతిబంధకములు నగును. కనుక వానిని విడిచియే సిద్ధోపాయమును వరింపవలయును. మఱియు నా యుపాయాంతరములం దన్వయము పురుషార్థమును బోఁగొట్టుకొనుటకును మూలమగును. ఎట్లన, దశరథచక్రవర్తి మున్ను దాను తన యిల్లాలికిఁ జేసినవరప్రదానమును దప్పరాదనితలఁచి ధర్మాభాసమైన యాసత్యధర్మమందు నిలిచి 'రామో విగ్రహవాన్ ధర్మః' అని ధర్మమూర్తియైన రామునితోఁగూడి మనునట్టి పురుషార్థమును దిగనాడినట్లె ధర్మాభాసములైన *యుపాయాంతరముల విడువరాదని వానియం దన్వయించిన యెడల 'కృష్ణం ధర్మం సనాతనమ్' అని సనాతనధర్మమైన భగవంతునితోఁ గూడి మనునట్టి పురుషార్థమును బోఁగొట్టుకొనవలసివచ్చుచున్నది.

* సర్వధర్మములను విడువుమనుటచే అధర్మము ప్రవేశింపవచ్చును. ఎట్లన, ధర్మములు 'ఇదం కురు' అని విధిరూపముగాను 'ఇదం మాకార్షీః' అని నిషేధరూపముగాను నున్నవి. అనఁగా, విహితముల ననుష్ఠింపఁజేయునవిగాను నిషిద్ధములఁ బరిహరింపఁజేయునవిగాను నున్నవి. ధర్మములను విడువు మనుటచే విహితానుష్ఠానములతోఁగూడ నిషిద్ధ

'మామ్' నన్ను - మనల రక్షించునో రక్షింపఁడో యను సంశయము కలుగునట్లు సర్వప్రాణిరక్షాదీక్షితుండై యుండుటవలన సర్వరక్షకుండై, తన గొప్పతనమును చేతనుల యల్పత్వమును బాటింపక 'సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేஉచ్యుత' అని నియోగించిన కార్యములు సేయుచుండు నీసేవకుండై, నిన్ను రక్షించుటయందలి యాతురతచే 'రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే' అన్నట్లు రక్ష్యభూతుండైన నీయిష్ట మెఱింగి, మన దోషములను జూచి నిరసించునో యని తలంక

---

పరిహారములను విడువవలసివచ్చును. నిషేధవాక్యములు లోపల రాకుండునట్లు తలుపు మూసియుండఁగా, తలుపు దెఱువఁగానే యావాక్యములు ప్రవేశించునట్లు నిషిద్ధముల పరిహారమును విడిచినయెడల అధర్మములైన నిషిద్ధప్రవృత్తులు యడ్డపాటునులేక ప్రవేశించునుగాన నిట్లధర్మములు ప్రవేశింపవా యని యడుగవచ్చును. అయిన నిచట ధర్మములను విడుమటమాత్రమే చెప్పఁబడినదిగాని యధర్మములను జేయుమని చెప్పుటలేదు. కాన అధర్మములు చొరనేరవు. అధర్మములను జేయునట్లు చెప్పకపోయినను, ధర్మమనఁగా అధర్మనివృత్తిగనుక ధర్మములను విడువుమనఁగా అధర్మనివృత్తులను విడువుము. (అనఁగా అధర్మములను జేయుము) అని అర్థవశమున సిద్ధింపదా యనిన, సిద్ధింపదు. ఏలన, ధర్మశబ్దము అధర్మనివృత్త్యాదులనంగముగాఁగల ప్రధానమైన విహితానుష్ఠానమును దెలుపునేకాని సామాన్యముగా అధర్మనివృత్తి మాత్రమును దెలుపునది కాదు. అట్లు తెలుపకపోయినను అది సర్వశబ్దముతోఁ గూడియుండుటచే నా విశేషణము యొక్క స్వారస్యమువలన నది తనకు విశేషణభూతమైన యధర్మనివృత్తిని జూపరాదా యన్నచోఁ జూపినను అది యిట వివక్షితము కాదుగనుక తద్రహితములైన విహితానుష్ఠానరూపధర్మములే యిచట గ్రాహ్యములు. ఇంతేల! అధర్మానుష్ఠానము శేషికి అనిష్టముగాన వానికనిష్టములైన ఈ యధర్మముల నాచరించుట శేషభూతుఁడైన చేతనునికి స్వరూపముకాదు. కనుక నివి చేతనునికి స్వరూపవిరుద్ధములు. ఈశ్వరుఁడో సహాయాంతరసంబంధమును సహింపని యుపాయము గనుక చేతనుఁడు వానిని సహాయములుగాఁ జేయుయత్నముయొక్క నివృత్తిని గోరునేకాని ప్రవృత్తి నెంతమాత్రము నొల్లఁడు. ఇట్టి యుపాయమునకు నివి చేతనుని ప్రయత్నరూపములగుటచే విరుద్ధములే యగును. చేతనుని ప్రవృత్తికి ఫలము ఈశ్వరుని ప్రీతి. అట్టిప్రీతికి నివి ప్రతిబంధకము లగును గాన విరుద్ధములే యగును. ఇట్లు చేతనుని స్వరూపమును, ఈశ్వరునివంటి యుపాయమును, తత్ప్రీతివంటిఫలమును జూడఁగా, ఆ మూఁటికిని విరుద్ధములయిన యీ యధర్మములు చొరనవకాశము లేదు.

రానట్లు నీదోషములనే భోగ్యములుగాఁగొని, తా నశరణ్యా శరణ్యుఁడగుటచే నుతెవ్వరును నీకు ప్రాప్తు లేనిదశయందు నీకుశరణమై, చల్లఁదనమే గుణముగాఁగలజలము వేఁడిమినొందినట్లు నీయపరాధములను క్షమింపఁజేసి నిన్ను నాతో నొడఁగూర్చునట్టి పురుషకారభూతులే నీదోషముల నెత్తిచెప్పి నా కెడఁబాపఁజూచినను నిన్ను విడనాడనోపక రక్షించువాఁడనై యున్ననన్ను అనుట. 'మాౕమ్' అని కంటికి ప్రత్యక్షముగా గోచరించుచున్న యవతారరూపమును వరింపఁ జెప్పుటవలన, ఉండునట్టి ప్రదేశ మతిదూరమగుటచే చూడను సమీపింపను శక్యములుగాని పరవ్యూహములును, తన కసాధారణమైన దివ్యవిగ్రహమును దాల్పనిదై యుపాయాంతరనిష్ఠుల కుద్దేశ్యమై యగ్నీంద్రాది దేవతలయం దుండు నంతర్యామిత్వమును, ఇచట వరణీయములు కా వని తెలియునది.

'ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి' అని స్వప్రాప్తి కుపయుక్తమైన ధర్మమును స్థాపించుటకై యవతరించినతానే 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని మోక్షసాధనములుగా శాస్త్రములు ప్రతిపాదించు సర్వధర్మములను విడువు మని చెప్పఁదగునా యన్నచో, అవి సాక్షాద్ధర్మములు గావు, తానే స్థాపనీయమైన సాక్షాద్ధర్మము గనుక వానిని విడిచి తన్ను వరింపఁజెప్పినాఁడు. ఇట్లు చెప్పుటచే త్యాజ్యములుగా ముందు చెప్పఁబడిన యుపాయములకంటె ఈశ్వరరూపమైన యీ యుపాయము అతిశయించిన దని తెలియుచున్నది. ఎట్లన, ఈశ్వరరూపమైన యీ యుపాయము, చేతనునిప్రవృత్తివలన స్వరూపము క్రొత్తగా సిద్ధింపనక్కఱలేక సనాతనధర్మమగుటచేఁ బూర్వమే సిద్ధమై, 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' అని సర్వజ్ఞమగుటచే పరమచేతనమై, 'పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే' అని సర్వశక్తియై, నడుమ నపాయములు గలుగుటకవకాశము లేనట్లు సిద్ధవస్తువై యుండుటచే నిరపాయమై, పరతంత్రుఁడైన చేతనుని స్వరూపమునకు ప్రాప్తమై, పూర్వోక్తపరమచేతనత్వా

దులు కలిగియుండునది గాన చేతనోద్దిష్టఫలమును సిద్ధింపఁజేయుటయందు సహాయాంతరము నపేక్షింపనిదై యున్నది. ఈ యుపాయము సహాయాంతర మపేక్షింపకుండుటకు కారణ మేమన, తక్కినయుపాయములు పూర్వమే సిద్ధము లైనవి కాక చేతనుని ప్రవృత్తివలనఁ గ్రొత్తగా సాధింపఁదగినవిగాన తమస్వరూపసిద్ధికి చేతనుని అపేక్షించియుండును. ఇవి చేతనుని కిది చేయవలయునని యెఱుఁగుటకుఁగాని చేసి తీర్చుటకుఁగాని యోగ్యతలేని అచేతనములును అశక్తములునై యుండుటవలన చేతనుని యిష్టప్రాప్త్యనిష్టపరిహారరూపమైన కార్యమును సిద్ధింపఁజేయుటయందు తమంత శక్తములు గాక ఫలప్రదత్వమున కుపయుక్తము లయినట్టి సర్వశక్తిత్వాదులు గల యీశ్వరుని నపేక్షించియుండును. ఈశ్వరుఁడు సాధ్యమును అచేతనమును అశక్తమును గాక పరమచేతనత్వాదులు గలవాఁ డగుటచే సహాయాంతర మపేక్షింపనియుపాయ మగును.

మఱియు 'మామ్' అని సారథ్యవేషమును జూపు నీపదమునందు ఆశ్రయణమును సురకముగావించు వాత్సల్యాదిగుణవిశేషము లెల్ల స్పష్టముగాఁ బ్రకాశించుచున్నవి. ఎట్లన, అధర్మబుద్ధిచే యుద్ధాఖ్యధర్మమునుండి యర్జునుఁడు తొలఁగినను దానిని తప్పుగాఁ గొనక యపేక్షితార్థమును దయచేయుటవలన వాత్సల్యమును, తనపరత్వమును బలుమాఱు చెప్పుటేకాక దాని నర్జునునకుఁ బ్రత్యక్షముగా చూపుటవలన స్వామిత్వమును, "హేకృష్ణ హేయాదవ" అని యర్జునుఁడు పిలుచునంతటి చనవుతో వానిని గలసిమెలసి యుండుటవలన సౌశీల్యమును, అప్రాకృతమైన తనదివ్యవిగ్రహమును కంటికి గోచరముగాఁ జేయుటచే సౌలభ్యమును స్పష్టముగాఁ బ్రకాశించుచున్నవి. ఆశ్రితులకు నయనగోచరముగా నవతరించుటయె సౌలభ్యము. అందును నీచమైన సారథ్యమును బూనుట సౌలభ్యాతిశయము. అట్టి సౌలభ్యాతిశయమును దెలుపు సారథ్యవేషముచే "మామ్" అని చూపుచున్నాఁడు.

'ఏకమ్' ఈశబ్దము స్థానప్రమాణమునుబట్టి అవధారణార్థక మగును. అనఁగా 'మామేవ యే ప్రపద్యన్తే' 'తమేవ చాద్యమ్' 'త్వమేవోపాయభూతో మేభవ' అని ప్రపత్తివిషయమున నీశ్వరుని ఉపాయముగాఁ జెప్పు స్థానములందెల్ల 'మామేవ' 'తమేవ' 'త్వమేవ' అని స్వీకరింపఁబడు నుపాయవస్తువుతోను నిర్దేశించి పిదప 'ఏవ' అనియవధారణమును బ్రయోగించుట వలన నిచటయు ప్రపత్తివిషయక మైనస్థాన మగుటచే ఏకశబ్ద మవధారణార్థకమే యగును.

ఈయవధారణార్థకము తాను గైకొన్నవానిదప్ప తక్కినవానిని వ్యావర్తించును (తొలఁగించును) గాన నిచట దేనిని గైకొని దేనిని తొలఁగించుచు నన్నచో, ఈశ్వరునియం దుపాయభావమును గైకొని 'వ్రజ' అని మీఁదఁ జెప్పఁబడు స్వీకారమునం దుపాయభావము వ్యావర్తించుచున్నది. అనఁగా భగవంతుఁడే ఉపాయ మగును గాని భగవంతుని స్వీకరించుట ఉపాయము కానేర దని తెలుపుచున్నది.

ఉపాయమును స్వీకారము చేసినపిదపనే యది కార్యకరమగును గాన ఆస్వీకారము పురుషార్థమున కావశ్యకమై యుండఁగా దానికి నుపాయత్వమును దొలఁగించుటయెట్లు అన్నచో, ఆస్వీకారమునకుఁ బిదపఁ గలుగు అనిష్టనివృత్తియు ఇష్టప్రాప్తియు నీశ్వరునివలనఁ గలుగు నట్లు, ఈరెంటికి మునుపటిదైన స్వీకారమును వానివలననే కలుగుచున్నది. ఇట్లీస్వీకారము, ఉపాయభూతుఁడైనయీశ్వరుని కార్యమే యగునుగాని తనంత నుపాయముకానేరదు. ఇది వానివలనఁ గలుగుట యెట్లన్నచో, కరణకళేబరరహితుఁడై భోగమోక్షశూన్యుఁడై చేతనుఁ డచిత్తువలె నుండినప్పుడు ఈశ్వరుఁడు వానికి కరణకళేబరము లొసఁగి జ్ఞానవికాసములోఁగూడినవానినిగా సృజించెను మఱియు వానిని గైకొనుటకై తా ననేకావతారము లెత్తినపుడు తనయందు వాని కాశ్రయణ రుచివిశ్వాసములు కలుగునట్లు తనదివ్యగుణచేష్టితాదులను ప్రకాశింపఁ

జేసెను. ఇట్లీశ్వరుఁడు సృష్ట్యవతారాదులమూలమున చేతనునికి జ్ఞాన వికాసాశ్రయణాదులు కలిగించుటంజేసి వాఁ డీశ్వరుని స్వీకరించినవాఁడ య్యెను. కనుక చేతనునిస్వీకార మీశ్వరుఁడు చేసినకృషియొక్క ఫలమే- అనఁగా నది యీశ్వరునికార్యమే. కాన స్వీకారముసైతము ఈశ్వరుని వలననే కలిగినదగును.

"ఇట్లీశ్వరుఁడు మనస్వీకారమునకు తానే కృషి సేయువాఁడగుట వలన నిట్టిస్వీకారమునుబట్టి వాఁడు మనకార్యములు సేయువాఁడు కాఁడు. ఈస్వీకారములేక తానే మనకు ఇష్టానిష్ట ప్రాప్తిపరిహారరూపమైన కార్యము సేయును" అని ప్రపత్తి సేయఁదగును. ఇట్లుసేయక, వాఁడు మనకార్యముసేయుట కీస్వీకార మావశ్యక మని తలఁచినయెడల నపుడు వాఁడు సహాయాంతరము నపేక్షింపనియుపాయ మగుట ఘటింపఁజాలదు.

ఈస్వీకారమువలనఁ బనలేనిచో దీని నిచటఁ జెప్పనేల యని యడుగవచ్చును. ఈస్వీకారమునుబట్టికాక యీశ్వరుఁడు తానే యందఱి నుజ్జీవింపఁజేయునెడల నప్పు డందఱికి ముక్తి కలుగవలయును. అట్టి ప్రసంగమును పరిహరించుటకై యీస్వీకారము చెప్పఁబడినది. మఱియు 'ఈశ్వరుఁ డింతకాలము మనల రక్షింపనివాఁ డిప్పుడు రక్షించుననుట కేమిగలదు' అని చేతనుఁడు కలంగి యధైర్యపడకుండునట్లు వానిబుద్ధికి సమాధానముగా నిది ప్రతిపాదింపఁబడినది. చేతనుఁడు జడవస్తువు కాక చైతన్యాశ్రయుక్తమైనజ్ఞానము గలవాఁ డగుటచే ఈశ్వరుఁడే యుపాయ మని స్వీకారముసేయుట (అనఁగా అధ్యవసాయము గలిగియుండుట) వానిచైతన్యమువలననుండి తనంతఁగల్గినకార్యమై యగును. ఈయుపాయ విషయమున రసజ్ఞుఁడగుటచే ఈస్వీకారము విధిపూర్వముగాక చేతను నికి రాగప్రాప్తమైయుండును. వానినే రక్షకుఁడుగా కలిగియుండుట చేత నుని స్వరూపము గనుక ఈస్వీకార మాస్వరూపములోఁ జేరినదియగును. అనాదికాలముగా వానిరక్షణము నిషేధించుచున్న చేతనుఁ డిప్పు డా రక్షణను నిషేధింపకుండుట ఈస్వీకారము సూచించుచున్నది. కనుక

నిది సర్వముక్తిప్రసంగపరిహారార్థముగాను, బుద్ధిసమాధానార్థముగాను. చైతన్యకార్యముగాను, రాగప్రాప్తముగాను, స్వరూపగతముగాను, అప్రతిషేధద్యోతకముగాను ప్రాప్తమైన దని గ్రాహ్యము.

ఈ 'మామ్' అనుపదము, ముందు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనుచో, నీశ్వరుడగు తనకును ఉపాయాంతరములకును గలకూడికను దూలించెను. ఇప్పు డీపదమీ 'ఏకమ్' అను నిచట నీశ్వరుడగు తనకును స్వీకారమునం దుపాయబుద్ధి గలవానికిని గలకూడికను దూలించెను. అనగా "సర్వధర్మాన్ పరిత్యజ్య" 'ఏకమ్' అను నీరెంటియొక్క స్వారస్యమువలన "మామ్" అనుపదము ఈశ్వరు డుపాయాంతరములనుగాని స్వీకారమునుగాని యపేక్షింపక (అనగా వానిసంబంధము లేక) కేవలము తానే చేతనునికార్యసిద్ధికి నుపాయభూతుడై యుండుటను దెలుపుచున్నది.

భగవంతుడు నిరుపాధికుడైన రక్షకుడు— అనగా ఏకారణమునుబట్టి కాక తనంతటనే రక్షించుస్వభావము గలవాడు. అట్టివానికి చేతనకృతమగు చేతనునిస్వీకారము సాధనముగానక్కఱలేదు. ఇట్లు వానికక్కఱలేని యీస్వీకారమును చేతనుడు తనంత గైకొనెనేని యిది స్వకర్తృత్వరూపమైన యహంకారము లోపల గలదై యవద్యకరమై కానిపించును గనుక చేతనునిస్వీకారము రక్షకము కానేరదు. నీని రక్షింతముగాక అని యీశ్వరుడు సేయుస్వీకారమే రక్షకము. తక్కినయుపాయములు చేతనప్రవృత్తివలననే సిద్ధించునవిగాన చేతనుని ప్రవృత్తియొక్క నివృత్తి ఆయుపాయములకు దోషము. ఈశ్వరుడనెడి యుపాయమో, సహాయాంతరసంబంధమును సహింపనిదిగాన చేతనుని ప్రవృత్తియె దానికి దోషము. కనుక దానికి చేతనప్రవృత్తియొక్కనివృత్తియె యావశ్యకము. ఈనివృత్తియె "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని వెనుక జెప్పబడినది.

ఈశ్వరుడు చేతనునికార్యము సేయుటకు చేతనునిప్రవృత్తియేమియు గూడకున్నను, ఇట్టియుపాయభూతునియెడల నాచేతనుని కుపకార

స్మృతియైన వలదా? ఈయుపకారస్మృతి, చేతనకార్యవిశ్వాసరునిచేఁ జేయించు నుపాయముకాదో యనిన, కానేరదు. ఇది చేతనునికి చైతన్యమువలనఁ గలిగిన దేకాని తనకార్యవిశ్వాసరునిచేఁ జేయించు నుపాయముగాఁ జేయఁబడినది కాదు.

'శరణమ్' ఉపాయముగా ననుట. ఈశబ్దము 'ఉపాయే గృహరక్షిత్రోః శబ్దశ్శరణ మిత్యయమ్' అని ఉపాయమును గృహమును రక్షితను జెప్పునదైనను నిది ఉపాయాంతరముల త్యజించి తన్నువరింపుమను ప్రకరణముగనుక ఉపాయార్థకమే యగును. మఱియు నీశ్వరుఁ *డుపాయమును ఉపేయమును (అనఁగా ప్రాపకమును ప్రాప్యమును) అగును. ఇచట 'వ్రజ' అను స్వీకారము భగవంతుని ప్రాప్యముగాఁదలఁచియు ప్రాపకముగాఁదలఁచియు చేయవచ్చును గాన నిచట వానిని స్వీకరించుట ప్రాపకముగానా? ప్రాప్యముగానా? యని శంక కలుగుచున్నది. ఇచట ప్రాపకముగా (ఉపాయముగా) స్వీకరించుటయే యావశ్యకము గనుక ఉపాయవాచి యగు శరణశబ్దము ప్రయుక్తమైనది.

'వ్రజ' బుద్ధిసేయుము. 'వ్రజగతౌ' అని యుండుటచే వ్రజధాతువు గత్యర్థకము. గత్యర్థకములెల్ల బుద్ధ్యర్థములు నగునుగాన బుద్ధిచేయుమని యర్థము. కరణత్రయముచేతను జేయఁబడుస్వీకారమే యధికారపూర్తి కుపయుక్తమగుటవలన కాయికవాచికమానసానుష్ఠానములు అపేక్షితము లయ్యును 'జ్ఞానానన్త్మోక్షమ్' అనుటచే జ్ఞానవిశేషరూపమైన మానసానుష్ఠానమే మిక్కిలి యపేక్షితముగాన నదియె యిచట 'వ్రజ'

*ఉపాయాంతరములను బరిత్యజింపు మనుటచే స్వీకరింపఁబడు వస్తువు ఉపాయ మగుటను దెలుపుచుండఁగా శరణశబ్దమేల యన్నచో, ఉపాయాంతరత్యాగము ప్రాపకమైనప్పుడును గలుగును; నదీని స్తరణము ప్రాప్తమైనపిదప నుపాయమైన ప్లవముయొక్క పరిత్యాగమువలె, ప్రాప్యమైనప్పుడును గలుగును. ఇట్లు ఉపాయాంతరత్యాగవిశిష్టమైన స్వీకారము రెండు సమయములకును సమానమై యుండుటవలన, ప్రాపకముగా మాత్రము గాని ప్రాప్యముగా వ్యవచ్ఛేదింపఁ (దొలఁగింపఁ) జాలదుగాన ప్రాపకవాచియైన శరణశబ్దము ఆవశ్యకమైనది.

అని చెప్పఁబడినది. ఈజ్ఞానవిశేషమే అధ్యవసాయాత్మకమైన బుద్ధి విశేష మగుటచే అధ్యవసింపు మని యర్థము.

ఇట్లు పూర్వార్ధమున 'సర్వధర్మాన్' అని త్యాజ్యములనుజెప్పి "పరిత్యజ్య" అని త్యాగప్రకారమును జెప్పి "మామ్" అని స్వీకరింపఁ బడునుపాయమును జెప్పి, "ఏకమ్" అని ఉపాయము నిరపేక్షమగుటను జెప్పి, "శరణం" అని ఉపాయత్వమును జెప్పి, 'వ్రజ' అని ఉపాయస్వీకారమును జెప్పినవారైరి.

'అహమ్' నేను-సర్వజ్ఞుఁడును సర్వశక్తియునైన నేనుఅనుట. చేతనునికి ఈశ్వరుఁడనిష్టనివృత్తియు ఇష్టప్రాప్తియుఁగృపసేయుటకుఁ బూర్వమువాఁ డున్నస్థితియు నిఁక వాఁడు పోఁగలగతియు నెఱుఁగుటకును, ఎఱిఁగి వానికి వలయువానిని జేసి యొడఁగూర్చుటకును వలయునట్టి సర్వజ్ఞత్వసర్వశక్తిత్వము లనెడు గుణవిశేషములును, ఈశ్వరుఁడు చేతనునిబట్టి కాక తనకొఱకే వానికార్యములు సేయుటకు వలయు శేషిత్వమనెడుబంధవిశేషమును, ఈపదమునఁ బ్రకాశించుచున్నవి. 'మామ్' అనుచో ఈశ్వరునిసౌలభ్యవిశేషమును జూచి యర్జునుఁడు "సర్వాధికుఁడైనయీశ్వరుఁడు కృపచే నిట్లయినాఁడు" అని తలఁపక 'మనకూడిగము సేయువాఁడు సర్వధర్మములను విడిచి తన్ను వరింపుమని మనకు నియమించుచున్నాఁ డేమి' యని తలంకఁగా, స్వాధీనచేతనాచేతనస్వరూపస్థితిప్రవృత్తుఁ డై నిరంకుశస్వతంత్రుఁ డై యున్న తనయథావస్థితవేషమును "అహమ్" అని చూపినాఁడు. కనుక ముందు 'మామ్' అనుచో ఆశ్రయణీయుఁడగుటకు వలయువాత్సల్యాదిగుణములను, ఇపుడు 'అహమ్' అనుచో, కార్యకరుఁ డగుటకు వలయు జ్ఞానశక్త్యాదిగుణములనును బ్రకాశింపఁజేసినాఁడు. కనుక ముందు పారతంత్ర్యమును ఇపుడు స్వాతంత్ర్యమును దెలిపినాఁడని తెలియునది.

'త్వా' అజ్ఞుఁడై, అశక్తుఁడై, అప్రాప్తుఁడై నన్నే ఉపాయముగాఁ జేపట్టియున్న నిన్ను అనుట.

"సర్వపాపేభ్యః" మత్ప్రాప్తికి ప్రతిబంధకములుగా నీవు తలంచిన పాపము లన్నిటినుండి యనుట. ఇచట బహువచనమువలన అవిద్యా కర్మవాసనారుచిప్రకృతిసంబంధములును గ్రాహ్యములు. సర్వశబ్దము వలన ప్రకృతివాసనచే తృణములు త్రుంచుట మొదలైనవానివలె అబుద్ధిపూర్వకముగాఁ జేయఁబడునవియు, సాధనబుద్ధిచేఁ గాకపోయినను లోకాపవాదమునకు భయపడియు, మనము విడిచిన లోకులును విడిచి నశింతురే యను కరుణచేతను, రజస్తమస్సులచే బుద్ధికలఁగియుఁ జేయఁబడునవియెల్ల గ్రాహ్యములు.

ఇవి సాధనబుద్ధిచేతఁ గాక లోకాపవాదులనుబట్టి చేసినను త్యాజ్యోపాదేయములతో నన్వయించునా యని తలంపరాదు. చిత్తవిభ్రమము గలవాఁడు ఈయూరికి పోవలయుననుట లేక యేదో యొకమార్గమునఁ బోయినను నాదారికొకయూరితో సంబంధ ముండుటవలన నాయూరు చేరునట్లు సాధనబుద్ధి లేకయే వీనిని చేసినను త్యాజ్యోపాయములతో నివి యన్వయింపకమానవు. మతి కలఁగి ప్రవృత్తిని మరలఁజేసినను అది యుపాయాంతరమువలె పాతకమే యగును.

"మోక్షయిష్యామి" ముక్తుఁ డగునట్లు చేసెదను. ఇచట క్రియ ప్రేరణార్థకము గనుక నిందీశ్వరుఁడు తానే కర్తగాక మఱొకనిచేఁ జేయించుకర్తయై యున్నాఁడు. దీనివలనిస్వారస్యమేమన, "నిన్నా పాపములనుండి విడిపించుటకు నాకర్తృత్వము అక్కఱలేదు"– అనఁగా "నే నేమియు ప్రయత్నము చేయనక్కఱలేదు. నీవు నందులకై ప్రార్థింపనక్కఱలేదు. అవి నీవు నన్ను వరించుటను జూడఁగా తామే విడిపోవు" నని యాశయము. ఏలన, అవి నానిగ్రహమును గైకొనఁగా నిగ్రహఫలములైనయవియు వీడిపోవక యుండునా యనుట. నీవు నాశరీరభూతుఁడవు. మనుష్యుఁడు తనశరీరమునందలిమాలిన్యమును తానే పోఁగొట్టుకొనునట్లు నాశరీరమైన నీయందుఁ గల యవిద్యారూపమాలిన్యమును శరీరి యగునేనే పోఁగొట్టుకొనఁగలవాఁడ నని భావము.

"మాశుచః" దుఃఖింపకుము. నీకార్యమునందు నీ వేమియు ప్రయత్నము సేయ నక్కఱలేక నేనే యందులకై పాటుపడుచుండఁగా నీకు శోకింపఁ బనిలేదు. నీపాపములను సైఁచి నేను వానిని బుణ్యములుగాఁ దలఁచి యుండఁగా నీవు శోకింపవచ్చునా యని భావము.

అర్జునుఁడు కృష్ణుని గుణానుష్ఠానుష చేష్టలను, "ఏష నారాయణ శ్శ్రీమాన్" ఇత్యాదిఋషివాక్యములను, బాల్యమాదిగా తనకార్యము నధికరించి పాటుపడుచుండుటను జూచి "ఇతఁడు చెప్పినుపాయము లుపాయములు గావు; ఇతఁడే మన కుపాయము" అని విశ్వసించినపిదపనే కృష్ణుఁడు "మామేకం వ్రజ" అని తన్నుపాయముగా స్వీకరింపఁ జెప్పినాఁడు. అర్జునుఁడు "యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని మొదట వేఁడినప్పుడే యీ యుపాయము నేల యుపదేశింపరా దన్నచో, భగవంతుఁడు మొదట నుపాయాంతరములను జెప్పి, వానిని అర్జునుఁడు గైకొనునో లేక దోషములుగాఁ గొనునో యని వానిహృదయమును పరిశోధించి, దోషములుగా గ్రహించినపిదప నర్హుఁడని వాని కీయుపాయము నుపదేశించినాఁడు. ఇది సరికాని, వేదము లేల యాయుపాయాంతరముల విధించెడి నన్నచో, దుష్టపశువునకు గుదిగట్టి గట్టునట్లు అహంకారమమకారవశ్యుఁడై స్వరూపజ్ఞానము లేక తిరుగునట్టి చేతనునికి కాయక్లేశరూప మైన కర్మానుష్ఠానాద్యుపాయములు విహితము లైనవి. ఈకర్మజ్ఞానాదులచే రజస్తమోనివృత్తి గలిగి సత్త్వము వృద్ధి నొంది తన్మూలమున భగవదతి పారతంత్ర్య మనెడిస్వరూపముయొక్క జ్ఞాన ముదయించునని యాశయము. స్వరూపజ్ఞానోదయముకలిగించునీయుపాయాంతరములఁ ద్యజింపవచ్చునా యన్నచో, చరమాశ్రమము స్వీకరించినసన్న్యాసి పూర్వాశ్రమధర్మములఁ ద్యజించునట్లు ఈయుపాయములను దోషములని తలఁచి సిద్ధోపాయము స్వీకరించు నంతజ్ఞానపరిపాకము గల యధికారికి వీనిని

త్యజించుట దోషము కాదు. వీఁ డాయుపాయములను స్వరూపముతో విడిచినవాఁడుకాఁడు. వానిని వేఱురూపములఁ గైకొనియే యున్నాఁడు. అనఁగా వానిని ఉపాయరూపమునఁ ద్యజించి కైంకర్యరూపమున స్వీకరించియే యున్నాఁడు. * ఆ యధికారికి కర్మము కైంకర్యముగాను, జ్ఞానము స్వరూపప్రకాశముగాను, భక్తి ప్రాప్యరుచిగాను, ప్రపత్తి స్వరూపయాథాత్మ్యజ్ఞానముగాను నగును. ఎట్లన, భగవంతుఁడు వర్ణాశ్రమధర్మరూపమైనకర్మమును లోకోజ్జీవనమునకొఱకు నేర్పఱచి తానును అవతారములందును వాని ననుష్ఠించియు తనవారి ననుష్ఠింపఁజేసియు నున్నాఁడు. ఇట్టికర్మ మీ యధికారి, తన కక్కఱ లేకున్నను పరులు తన్నుఁజూచి యనుష్ఠింపవలయు నను కరుణచే నుపాయబుద్ధి మాని, యనుష్ఠించు నేని యిది విధాయకమైనభగవంతునికి ప్రీతిహేతు వగును గాన తత్కైంకర్యమే యగుచున్నది. వీనిస్వరూపము భగవదేక శేషత్వము. పరస్వరూపము (ఈశ్వరస్వరూపము) నిరుపాధిక శేషిత్వము. ఇట్టిస్వరూపజ్ఞానము మున్నుగలిగి తన్మూలమున పరస్వరూపము సాక్షాత్కరించుటకు హేతువైనది జ్ఞానయోగము. ఇట్టిజ్ఞానయోగము ఉపాయబుద్ధిలేక యనుష్ఠింపఁబడు నేని అది స్వస్వరూపజ్ఞానపూర్వకమైన పరస్వరూపముయొక్క ప్రకాశమగును. అనఁగా ఈశ్వరునినిరుపాధిక శేషిత్వముయొక్క సాక్షాత్కారమగును. భోజనమునకుఁబూర్వము క్షుత్తు ఎట్లో యట్లు ప్రాప్యమైనకైంకర్యమునకుఁ బూర్వము రుచి యావశ్యకము. ప్రాప్యరుచివలననె కైంకర్యమునం దన్వయము కలుగును. అనన్యవిషయమైనభక్తి, యుపాయబుద్ధి లేక యనుష్ఠింపఁబడు నేని యిట్టి ప్రాప్యరుచియే యగును. సిద్ధోపాయవరణరూపమైనప్రపత్తి, ఉపాయబుద్ధిలేక చేయఁబడు నేని అతిపరతంత్రమై అనన్యశరణమై యుండు

*కర్మయోగముచే రజస్తమోనివృత్తిగలిగి సత్త్వము వృద్ధినొందును. దానివలన జ్ఞానయోగముగలిగి పరిణమించి దర్శనసమానాకారమై (భక్తియై) స్వరూపయాథాత్మ్య జ్ఞానముగలుగును. అదిగలిగినపిదప 'వాఁడేయుపాయ' మను సిద్ధోపాయము (ప్రపత్తి) గలిగి స్వరూపానురూపమైన పరార్థ్య, కైంకర్యము సిద్ధించు నని సంప్రదాయము.

స్వరూపముయొక్క యాథాత్మ్యజ్ఞానముగా (అనఁగా స్వరూపము యొక్క కలరూపైన తదేకోపాయత్వముగా) నగును. మోక్షమున కుపాయము లైనభక్తిప్రపత్తులు రెండును నుపాయములు గావని విడిచిన, నింక నుపాయ మెద్దియన్నచో, భక్తి కష్టసాధనము, ప్రపత్తి సులభ సాధనము ఇది కష్ట మది సులభమని పాటింపక రెంటిని భగవంతుఁ డుపదేశించుటను జూడఁగా నిజమున కవి యుపాయములుగాక వ్యాజ మాత్రములే యగుటంజేసి యట్లు చెప్పినాఁడని తెలియునది. భగవత్ప్రసాదమే యుపాయము. ఇట్టిపురుషార్థమున కీయధికారి తనంతఁ జేయవలసిన దేమియు లేదు. భగవంతుఁడు చేయురక్షణమును ప్రతి పుచ్చుకుండినఁ జాలును. వీనియందు భగవద్రక్షణమును ప్రతిపుచ్చు కొండుటతోఁ గూడ సుకృత మేదైన నుండిన నొప్పదా యనిన నొప్పదు. ఏలన భగవంతుఁడు పురుషార్థమునకు నిరపేక్షమైన (అనఁగా సహా యాంతరము నపేక్షింపని) యుపాయ మగును. పాపము పురుషార్థము నకు హేతువు గాదు గనుక దానివలన భగవంతునకు సహాయము లేదు. కాన వానియుపాయనిరపేక్షత్వమునకు అది భంగము కలిగింప నేరదు. కనుకనే రాముఁడు పాపములతోఁ గూడి వచ్చినను తనకుఁ గూడునన్నాఁడు. పుణ్యము పురుషార్థమునకు హేతు వైనది గనుక నది భగవంతునికి సహాయకారి యై తన్నిరపేక్షత్వమునకు భంజక మగును. కనుకనే కృష్ణుఁడు పుణ్యమును విడిచిరమ్మనెను. అనఁగా వాఁడు సహా యాంతరసంబంధ మింతమాత్ర మోర్వనిపురుషార్థసాధకమని భావము.

ఇట్లు ఉత్తరార్ధమున 'అహం' అనుటచే స్వీకృతమైన యుపాయము యొక్క జ్ఞానశక్త్యాదిగుణయోగమును, 'త్వా' అనుటచే అట్టిగుణవిశిష్ట వస్తువునందు న్యస్తభరుఁడై యుండు నధికారియును, 'సర్వపాపేభ్యః' అనుటచే అధికారికి విరోధియగు పాపసమూహమును 'మోక్షయిష్యామి' అనుటచే తాత్పర్య విమోచనప్రకారమును, 'మాశుచః' అనుటచే

తత్ప్రాపకోపాదానము నొందినయధికారియొక్క నిర్భరత్వమును (నెమ్మదియుఁ) జెప్పఁబడినవి.

ఈశ్లోకమునకు ఈశ్వరుని స్వాతంత్ర్యమునందు పర్యవసించుటే హృదయము. ఎట్లన, శాస్త్రవిహితములైన సకలధర్మములను సవాసనముగ విడిపించి చేతనునకు తానే నిరపేక్షసాధనమై, స్వప్రాప్తిప్రతిబంధకము లైనసకలపాపములను దూలించి, స్వప్రాప్తిని గలిగించు స్వాతంత్ర్యము నీశ్వరుఁడు గైకొనునని యీశ్లోకముయొక్క ముఖ్యతాత్పర్యము.

# శ్రీ భగవద్గీతా శ్లోకములకు

## అకారాదివర్ణక్రమసూచి

శ్రీ భగవద్గీతాశ్లోకపాదానుక్రమణిక

సంపూర్ణము.

